

1
3—75

# తెలుగు అధికార భాష

వావిలాల గోపాలకృష్ణయ్య
అధ్యక్షులు
అధికార భాషా కమిషను




447

ప్రచురణ
సాధారణ పరిపాలన (అధికార భాష) శాఖ
ఆంధ్రప్రదేశ్, హైదరాబాదు
1975

1/3-75

# తెలుగు అధికార భాష

ACC. No. 5716

ప్రపంచ తెలుగు మహాసభలు

[రాక్షస (1975) ఉగాది]

సందర్భంగా

అధికార భాషా కమీషను

సమర్పణ

# తెలుగు: అధికార భాష

"తేటల్ దేరెడు కాంతిపూరముల నుద్దీపించు ముత్యాలు ము
వ్రేటల్ వోలె త్వదీయ కంఠమున శోభింపుల్ నిగారించు, చే
నాటన్ జీవన శోషణల్ గనని కృష్ణా, గౌతమీ, పెన్నలన్
గాటంపుందమి త్రావువార మిదె కాంతాతీర మాంధ్రావనీ"

భారతదేశంలో నడచిన స్వాతంత్ర్యోద్యమంలో ఇరువదవ శతాబ్దం మొదటి పది సంవత్సరాలలో భాషోద్యమానికి ఆంధ్రావనిలోని ప్రజలు వైతాళికులైనట్లే, భారత స్వాతంత్ర్యానంతర భాషాప్రయుక్త రాష్ట్ర నిర్మాణ సాధనలోనూ ప్రథములు అయినారు.

లార్డు కర్జన్ ఏనాడు బెంగాలు ప్రజలను చీల్చి భాషా ప్రాతిపదిక కాకుండా, హిందూ ముస్లిం మతప్రాతిపదికగా రాష్ట్రాలు నిర్మించాడో, ఆనాడే ప్రజానీకం జాగరితమై భారత రాజకీయరంగంలో స్వాతంత్ర్య ప్రజ్వలనతో పరపరిపాలన అంత మొందించవలెనను ఆవేశం కలిగింది. బెంగాలు అవిభాజ్యమని, బెంగాలు ప్రజానీకం సింహగర్జన చేసింది. పరభాషకు వ్యతిరేకంగా బెంగాలులో బెంగాలు భాష, మహారాష్ట్రంలో స్వదేశీ, ఆంధ్రలో జాతీయోద్యమ బీజాలు నవజీవనోద్యమంగా సాగించాయి. అంతా కలిసి వందేమాతరం ఉద్యమం అయింది. 1906లో విభజింపబడిన బెంగాలు 1912 లో సమైక్యం సాధించింది.

భాషాధారక రాష్ట్రాలు స్వాతంత్ర్యానికి, జాతీయతకు ప్రాతిపదిక అంటూ ప్రథమంగా పరిపాలన ప్రజలభాషలో జరుగవలెనని విద్యాబోధన మాతృభాషలో నేర్పబడవలెనని ఆంధ్రోద్యమం

ప్రారంభమైంది. 1913 లో బాపట్లలో ప్రథమ ఆంధ్ర మహాసభ జరిగింది. శ్రీ దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులుగారు ప్రథమ ఆంధ్ర మహాసభలో పరిపాలన, విద్యాబోధన మాతృ భాషలో జరిగితే, పరభాషలో జరగితేను, తల్లి చనుబాలతో పెరిగిన బిడ్డకు, పోతపాలతో పెరిగిన బిడ్డకు ఉన్నంత తేడా ఉంటుందని ఘంటాపథంగా నుడివారు. ఆంధ్రోద్యమం జాతీయోద్యమానికి పునాది అయింది.

ప్రజాస్వామ్యంలో ప్రజలు తమ పరిపాలనను, బోధనను, తమ మాతృభాషలో సాగించవలెననడం సహజం. ఈ సహజ వాంఛతోనే భాషా రాష్ట్ర ఉద్యమాలు సాగింపబడినవి. ఆంధ్రోద్యమ ఆశయాలలో ఒకటిగాఉన్న ఆంధ్ర విశ్వవిద్యా లయం 1926లో యేర్పడినప్పుడు ఆశాసనంలో ఆంధ్ర విశ్వకళా పరిషత్తు శాసనం 4 (3) సెక్షనులో తెలుగులో బోధన, పరీక్షలు తమ ఆశయమని నిర్దేశించడం ఇందుకు నిదర్శనం. ఆశయంగా శాసనంలో నిర్దేశించడమే జరిగిందికాని అమలు జరుపడం మాత్రం జరుగలేదు.

భాషాప్రాతిపదికమీద యేర్పడిన జాతీయోద్యమమే స్థిరమైన పునాదులమీద నిలబడగలదని. మతప్రాతిపదికమీద స్వాతంత్ర్యం తాత్కాలికమేనని పాకిస్తాన్ ఇరవై అయిదు సంవత్సరాల చరిత్ర రుజువు చేసింది. మతావేశంలో ప్రారంభమై నామరూపాలు కలిగించుకొన్న పాకిస్తాన్ 1969 కల్లా మతం కన్నా భాష ప్రాధాన్యమని ముజీబుర్ రహమాన్ నాయ కత్వాన ప్రారంభమైన బెంగాలు ఉద్యమం సర్వ స్వతంత్రసత్తాక ప్రజాస్వామ్యంగా 1971లో బంగ్లాదేశ్ యేర్పడి బెంగాలీ భాషను రాజభాషగా, బోధనాభాషగా నిర్ణయించుకుంది.

1950 భారత రిపబ్లిక్ అవతరణ అనంతరం శ్రీ అమర జీవి పొట్టి శ్రీరాములు బలిదాన ఫలితంగా కర్నూలు

రాజధానిగా, ఆంధ్రరాష్ట్రం 1953 అక్టోబరు1వ తేదీన ఏర్పడింది. నిజంగా ఆంధ్ర రాష్ట్రం ఏర్పడిన వెంటనే, ఆంధ్ర శాసన సభ తమ అధికారభాష తెలుగు అని ప్రకటించి ఉండవలసింది. అంత త్వరలో అతి సాహసంతో, ప్రభుత్వం ఏర్పడగనే తమ అధికారభాష బెంగాలీ అని ప్రకటించిన కీర్తి బంగ్లాదేశ్‌కే చెందుతుంది. అయినా శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య ప్రతిపాదించిన "రాజ్యాంగ నిబంధనలకు అసంగతంగా లేనంతవరకు, ప్రభుత్వ వ్యవహారాలను తెలుగులోనే నిర్వహించాలనే తీర్మానం" శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగారి "సాధ్యమైనంత త్వరలో" అనే సవరణతో 1955 సెప్టెంబరు 29వ తేదీన ఏకగ్రీవంగా ఆమోదింపబడింది. శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య ప్రతిపాదించిన బిల్లు మాత్రం త్రోసివేయబడింది.

1946 ప్రాంతంలో యేర్పడిన మద్రాసు కాంగ్రెస్ మంత్రి వర్గం ఆంధ్రజిల్లాలలో తూర్పు గోదావరిజిల్లాలో, తమిళనాడులో తంజావూర్ జిల్లాలో, విద్యాబోధన జిల్లాస్థాయివరకు మాతృభాష లోనే నిర్వహించవలెనని ఆంధ్రకేసరి శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులు ప్రభుత్వం ఆదేశించింది. అమలు జరపడానికి ప్రయత్నించింది. అదే తెలంగాణా ప్రాంతంలోని ఖమ్మం, నల్లగొండ వరంగల్లు, కరీంనగర్ జిల్లాలలో తెలుగు తాలూకాస్థాయిలో నడపవలెనని శ్రీ బూర్గుల రామకృష్ణారావు ముఖ్యమంత్రిగా వున్న ప్రభుత్వం నిర్ణయించింది. కాని తీవ్ర ప్రయత్నం మాత్రం జరగలేదని చెప్పవచ్చు. అందుకే ఈ తీర్మానం "సాధ్యమైనంత త్వరలో" అని ఉండడంతో, నత్తనడకతో ప్రారంభమయింది.ఒక ఉన్నతాధికారిని వేశారు. ఇంతలో విశాలాంధ్రను సాధించడం జరిగింది. నైజాం నిరంకుశ పాలనక్రింద ఉర్దూభాష రుద్దబడిన ఆంధ్ర ప్రజానీకం, నైజాం ఆంధ్రమహాసభ ఆధ్వర్యాన శ్రీ మాడపాటి హనుమంతరావు నాయకత్వాన ఆంధ్ర భాషాభివృద్ధికి, ఆంధ్రప్రజల సముజ్జీవనానికి, ఆంధ్రోద్యమం నడచింది. నైజాం

నిరంకుశత్వమే కాకుండా, నైజాం ప్రభుత్వాన్నే తొలగించుకోగలిగారు. అందరు తెలుగువారు ఒకటిగా అనేక శతాబ్దాల అనంతరం చేరగలిగారు. ఆంధ్రమాత కౌగిలిలో అనుంగు ఆశ్రమం పొందగలిగామని మహానందం పొందారు.

విశాలాంధ్ర ఏర్పడగానే ప్రథమ కర్తవ్యంగా ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం తెలుగును అన్ని స్థాయిలలో అటు అధికార భాషగా చేసి ఉండినట్లయితే విశాలాంధ్ర సాధించినందుకు నిజమైన సార్థకత ఉండేది. అది కూడా, మద్రాసు రాష్ట్రం నుండి విడివడిన మననాయకత్వం ఇంగ్లీషును వదలలేక, నైజాంపాలన నుండి బయటపడ్డ నాయకత్వం ఉర్దూనుండి బైటపడలేక తెలుగును అధికార భాషగా అమలు జరుపుటకు సాహసంతో నిర్ణయించుకోలేక పోవడంతో, అటు యిటు అధికారులు ఇంగ్లీషు అధికారభాషగా, బోధన భాషగా అమలుజరుపుటలో తమశక్తి సామర్థ్యాన్ని వినియోగించి రెండు ప్రాంతాలలోను ఇంగ్లీషును అలవాటు చేశారు. విశాలాంధ్ర రాష్ట్రం ఏర్పడిందనే సంతోషంలో, సంతృప్తి చెంది, అంతకుముందు ఈ రెండు ప్రాంతాలలోను నడచిన ఆంధ్ర పునరుజ్జీవన ఉద్యమాలు మరుగున పడినవి. ఇటు బయట సాంస్కృతిక ఆందోళనలో ఉద్యమం సజీవంగా నడవని సమయంలో, అటు అధికారులు, రాజకీయనాయకత్వం తెలుగుపై పట్టుదల వహించక, ఇంగ్లీషునే ప్రోత్సహించడం, ఇంగ్లీషు లేకపోతే బ్రతకలేమనే మనోదౌర్బల్యంతో పనిసాగిపోతే, అధికారులచేయి పైచేయి అయి అంతా ఇంగ్లీషులోనే సాగింది.

"దేశభాషలందు తెలుగులెస్స" అనే ఖ్యాతిగాంచి, ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్‌గా విశ్వవిఖ్యాతి గణించి, సాంకేతిక పరిజ్ఞానం ఇంగ్లీషు, ఫ్రెంచిభాషలకన్న మిన్నగా సమన్వయింపగలిగినది తెలుగు అని ప్రొఫెసర్ హాల్డేన్ చే గుర్తింపబడి, 5 కోట్ల ప్రజలు గలిగి భారతదేశంలో రెండవభాషగా గణుతికెక్కిన

తెలుగు ఈ నాటికీ పరిపాలనలో, బోధనలో సముచిత స్థానం పొందకపోవడం మన దురదృష్టం. భాషా ఉద్యమాల్లో, కర్ణాటక, మహారాష్ట్రలకన్న ముందే ప్రారంభించాం. అమలులో అందరికన్నా వెనుక ఉన్నాం.

అయితే ఆంధ్రప్రదేశ్ శాసనసభ సభాపతిగా శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు గారు ఎన్నిక అయిన తర్వాత శాసనసభ తరఫున ప్రముఖులతో ఉపసంఘాలు నియమించి ఒక బృహత్తరమైన "తెలుగు పారిభాషిక పదకోశం" తయారు చేయించి ప్రకటించారు. తెలుగును అధికార భాషగా అమలు జరపటానికి ప్రాతిపదిక వేశారు.

అప్పటికీ మనదేశంలో పదిరాజ్యాల్లో [ రాష్ట్రాలలో ] ప్రాంతీయ మాతృ భాషలను అధికార భాషలుగా నిర్ణయిస్తూ శాసనాలు చేయబడినవి. బీహారులో 1950లో హిందీ అధికార భాషా శాసనం చేయడం జరిగింది. పూర్వపు మధ్యభారత్‌లో కూడా సంవత్ 2007లో మధ్యభారత్ అధికార భాషాచట్టం ద్వారా హిందీని అధికార భాషగా నిర్ణయంచేస్తూ శాసనం చేయడం జరిగింది. తర్వాత 1957 లో మధ్యభారత్ [నేటి మధ్యప్రదేశ్ రాజ్యంలో] అధికార భాషా చట్టంద్వారా హిందీని అధికార భాషగా చేయడం జరిగింది. ఒరిస్సా రాష్ట్రంలో ఒడియాను అధికార భాషగా చేస్తూ 1954లో ఒరిస్సా అధికార భాషాచట్టం చేయబడింది. ఉత్తరప్రదేశ్ 1950 లో ఉత్తరప్రదేశ్ అధికారభాషా (బిల్లులు-ఆక్టులు) ఆక్టుద్వారా హిందీని అధికారభాషగా చేయడం జరిగింది. 1952 లో హిమాచలప్రదేశ్ భాషా (బిల్లులు-చట్టాలు) శాసనం ద్వారా హిందీ అధికారభాషగా హిమాచలప్రదేశ్‌లో చేయబడింది. రాజస్థాన్ రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ జరగకముందే హిందీని అధికారభాషగాచేస్తూ ప్రకటించడం జరిగింది. ఉమ్మడి బొంబాయి రాష్ట్రంలో గుజరాత్ ప్రాంతంలో గుజరాతీ, మహారాష్ట్ర ప్రాంతంలో మహారాష్ట్ర అధికారభాషగా నిర్ణయిస్తూ

ఆమేరకు బిల్లు రూపొందించబడింది. మహారాష్ట్ర, గుజరాత్ రాష్ట్రాలను వేరుచేసిన తర్వాత గుజరాత్ రాష్ట్రంలో గుజరాతీని, మహారాష్ట్రంలో మహారాష్ట్రిను అధికారభాషగా నిర్ణయిస్తూ 1960లో శాసనం చేయడం జరిగింది. అప్పటికే గుజరాత్‌లో భాగంగా మిళితం అయిపోయిన సౌరాష్ట్రంలో రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ జరగకముందే సౌరాష్ట్ర ప్రత్యేక రాజప్రముఖ పాలిత రాష్ట్రంగా వున్నప్పుడూ గుజరాతీని అధికారభాషగా చేస్తూ ప్రత్యేక శాసనం చేయడం జరిగింది. పూర్వ పంజాబు రాష్ట్రంలో హిందీ మాట్లాడే ప్రాంతాలలో హిందీని పంజాబీభాష మాట్లాడే ప్రాంతాలలో పంజాబీని అధికారభాషలుగాచేయబడినవి. దరిమిలాదానిని (ఆర్డినెన్సును)1960లో చట్టం కూడా చేయడం జరిగింది. అస్సాములో అస్సామీభాషను అధికార భాషను చేస్తూ 1960లో అస్సాం అధికారభాషాచట్టం శాసనరూపం దాల్చింది. అందులో పరిపాలనా కార్యాలకోసం కచారు జిల్లాలో బెంగాలీ భాషకూడ ఉపయోగించబడుతుందని పేర్కొనబడింది. ఇప్పుడు తమిళనాడు (ఆనాటి మద్రాసు) రాష్ట్రంలో తమిళమును అధికారభాషగాచేస్తూ 1956 లో మద్రాసు అధికారభాషా చట్టం చేయడం జరిగింది. ఆ చట్టం 1957 జనవరి 19వ తేదీన గవర్నరు ఆమోదంపొంది శాసనం అయింది. కేరళ రాష్ట్రంలో మలయాళాన్ని అధికారభాషగా అమలు జరిపేందుకు ఒక కమిటీని వేశారు. వారి నివేదిక ననుసరించి మలయాళాన్ని అధికారభాషగా అమలుజరుపుటకు తగు ఏర్పాట్లు చేశారు.

ఈ పోకడలు దేశంలో ఒకవైపు ఇట్లు జరుగుతుంటే శ్రీ వావిలాల గోపాల కృష్ణయ్య అటు కర్నూలులోను తర్వాత హైదరాబాదులోను ఆంధ్రప్రదేశ్ శాసనసభలో తెలుగును అధికార భాషగా శాసనం చేయుటకు బిల్లు రూపములోను, తీర్మానాల రూపంలోను దాదాపు తొమ్మిది పర్యాయాలు అదేపనిగా

ఉపపాదించుచూ వచ్చారు. చివరకు బిల్లు రూపంలో అచ్చు అవటానికి నోచుకోనేందుకు వీలులేని స్థితినుండి 1964 డిసెంబరు 7వ తేదీ ఆంధ్రప్రదేశ్ గెజెటులో ప్రకటన కాగలిగింది. దీనిని ప్రజాభిప్రాయానికి పంపడం జరిగింది. ప్రజాభిప్రాయం అన్ని వైపులనుండి అనుకూలంగా రావడం జరిగింది. ప్రజాభిప్రాయ ప్రకటన సందర్భంలో దినపత్రికలలో ఆంధ్రప్రభ చూపిన ఉత్సుకతను ప్రత్యేకంగా ప్రశంసించవలసి ఉంది.

ప్రజాభిప్రాయం తర్వాత ఈ బిల్లు సెలక్టు కమిటీకి పంపబడింది. సెలక్టు కమిటీ స్థాయిలో ఆనాటి ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి, ఆనాడు విద్యామంత్రి అధికార భాష శాఖను చూస్తున్న శ్రీ పి. వి. నరసింహారావు, బిల్లు సమూలంగా చర్చజరిగిన తర్వాత అనధికార బిల్లు బదులు అధికారబిల్లు తేదలచామని ఈ అనధికార బిల్లును ఉపసంహరించుకోవలసిందిగా ప్రతిపాదన చేశారు. అనధికార బిల్లు వుండవలెనని పట్టుదల లేదని, అధికార భాషగా శాసనం కావడమే ప్రధానమని ప్రభుత్వం బిల్లు శాసనసభలో ప్రతిపాదించటానికి ముసాయిదా అందజేసిన మరుక్షణం ఉపసంహరించటానికి తనకు అభ్యంతరం లేదని కాని, ఏ బిల్లూ లేకుండాపోయేస్థితిలో బిల్లును ఉపసంహరింపజాలనని చెప్పినపుడు వెంటనే ప్రభుత్వం తమ బిల్లుకు నోటీసు యివ్వడం-బిల్లు ముసాయిదా ప్రతిపాదించడం, శాసనసభ 1966 మార్చి 27 నను, శాసనపరిషత్తు 1966 ఏప్రిల్ 1వ తేదీనను అంగీకరించడం జరిగింది. ఆంధ్రప్రదేశ్ అధికార భాషా శాసనం 1966 మే 14 వ తేదీ ఆంధ్రప్రదేశ్ గెజెటులో ప్రకటింపబడటంతో శాసన రూపందాల్చింది.

తెలుగు అధికారభాషగా నడచిన చరిత్ర పరిశీలించుదాం. సుమారు వెయ్యి సంవత్సరాల నాడు అంటే తూర్పు చాళుక్యుల

పరిపాలన ప్రారంభంనుండి విజయనగర రాజుల పాలన అంతమైన 17 వ శతాబ్దివరకు తెలుగు అధికారభాషా స్థానాన్ని పొందినదని చెప్పవచ్చు.

వేంగీ చాళుక్యులు పశ్చిమ ఆంధ్రప్రాంతం పాలించిన 500–800 సంవత్సరాలలో సంస్కృతం, తెలుగు, కన్నడ భాషలు వాడినారు. రేనాటి చోళులు తీరప్రాంతం పాలించిన 1000-1200 లలో తెలుగు, సంస్కృతం వాడుకలో వుంది. కాకతీయులు తెలంగాణాతోసహా సమగ్రకోస్తా ప్రాంతం పాలించిన 1100-1330 సంవత్సరాలలో తెలుగు అధికార భాషగా, రాజభాషగా అమలుజరిగింది.

వెలనాటి చోళులు కృష్ణా, గుంటూరు జిల్లాలు పరిపాలించి నపుడు తెలుగు, కొద్దిగా సంస్కృతభాష వాడినారు. రెడ్డిరాజులు తీరప్రాంతాన్ని 1330-1450 లలో పాలించినపుడు ముఖ్యంగా తెలుగునూ, అపుడపుడు సంస్కృతాదిభాషలు రాజభాషలుగా అమలు జరుపుతూ వచ్చారు. రేచర్ల వెలమలు తెలంగాణా పాలించిన 1330-1458 సంవత్సరాలలో తెలుగును రాజభాషగా అమలు జరిపారు. విజయనగర రాజులు రాయలసీమ, కోస్తా ప్రాంతాలలో పరిపాలన సాగించినపుడు తెలుగు, కన్నడభాషలతోపాటు సంస్కృతం, తమిళం వాడుతూవచ్చారు. బహమని రాజుల కాలంలో తెలంగాణాలో 1336 నుండి 1578 సంవత్సరాలలో పర్షియన్ భాషను, అరబ్బీ భాషను ఉపయోగిస్తూ వచ్చారు. గజపతులు కోస్తా జిల్లాలలో 1458-1518 సంవత్సరాలలో తెలుగు, సంస్కృత భాషలు వాడుతూ వచ్చారు. కుతుబ్‌షాహీ సుల్తానులు తెలంగాణా ఉత్తర తీర ప్రాంతాలు, రాయలసీమ అంటే దాదాపు నేటి ఆంధ్రప్రదేశ్ అంతటా 1518 నుండి 1700 వరకు తెలుగు, పర్షియన్, అరబ్బీ భాషలు వాడుతూ వచ్చారు. ఆంగ్ల ప్రభుత్వం యేర్పడిన

తరువాత మద్రాసు రాజధానిలోవున్న యావదాంధ్ర జిల్లాలలో ఆంగ్లం, తెలుగు, ఉర్దూభాషలు ఉపయోగిస్తూ వచ్చారు. తెలంగాణాలో నైజాం సుల్తానులు ఉర్దూ, తెలుగు, ఆంగ్లభాషలు వాడుతూవచ్చారు. అటు తర్వాత ఆంగ్ల ప్రభుత్వం సర్కారు, రాయలసీమ జిల్లాలలో ఇంగ్లీషు తెలుగు భాషలలో పరిపాలన సాగించారు. అనుదినం ఇంగ్లీషు ప్రాధాన్యం హెచ్చించారు. 1946–47 లో తూర్పుగోదావరి జిల్లాలో, 1950–52 లో తెలంగాణా తూర్పు ప్రాంతాలలోనూ తెలుగును తాలూకాల స్థాయిలో అమలుజరుపుటకు ప్రయత్నం జరిగింది. తెలుగు మరుగుపడక పోయినా తెలుగుమరుపు తగిలేంతవరకు ఇంగ్లీషును సాగించారు. 1953 అక్టోబరు 1న ఆంధ్రరాష్ట్రం అవతరించింది. ఇంగ్లీషులోనే సాగింది. కొంత తెలుగుకు అవకాశం కలిగింది. 1956 లో ఆంధ్ర ప్రదేశ్ అవతరణ జరిగింది. ఉర్దూ బదులు తెలంగాణాలో కూడా ఇంగ్లీషు రుద్దబడింది. అధికార భాషగా ఉర్దూ బదులు తెలుగు కావలెనని తపస్సుచేస్తున్న తెలంగాణాలోనూ, ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రం కావాలని సాధించుకున్న సర్కారు, రాయలసీమ జిల్లాలలోనూ అధికార భాషగా తెలుగు అడుగు అరలలో సజీవంగా బ్రతుకు సాగించింది. 1966లో ఆంధ్రప్రదేశ్ అధికార భాషా శాసనం చేయబడింది.

494.813 - Acc. No. 5716

## ఆంధ్రప్రదేశ్ అధికారభాషా శాసనం

ఈ శాసనంలో 1. ఆంధ్రప్రదేశ్ అన్ని ప్రాంతాలకు ఆనాటి నుండి అధికారభాషగా తెలుగును నిర్ణయించడం జరిగింది. 2. రాష్ట్ర ప్రభుత్వం అప్పుడప్పుడు ఆంధ్రప్రదేశ్ గెజెటులో ప్రకటన ద్వారా తెలుగు భాషను ఆ ప్రకటనలో నిర్దిష్టపరుపబడిన ప్రభుత్వ అధికార కార్యకలాపాలకు నిర్ణయింపబడిన తేదీనుండి ఉపయోగించవచ్చునని ఆదేశింప వచ్చును. 3. (అ) శాసన మండలిలోను ఏ సభలోనైనా

ప్రవేశ పెట్టబడు బిల్లులు, (అ) గవర్నరు జారీచేయు ఆర్డినెన్సులు.
4. రాష్ట్ర శాసనం క్రిందగానీ పార్లమెంటు శాసనం క్రింద గాని రాష్ట్రప్రభుత్వంగాని, అధికార వర్గాలనుంచిగాని జారీ చేసే ఉత్తరువులు (జీవోలు) నియమాలు, రెగ్యులేషన్లు, నిబంధనలు ఉపనిబంధనలలో ఉపయోగించు భాష ప్రభుత్వం గెజెటులో నిర్ణయించిన తేదీనుండి తెలుగుభాష అయిఉండాలి. అయితే ఇచట పూర్వం ఆంగ్లభాష ఏయే అధికార కార్యకలాపాలకు వాడుతున్నారో అది కొనసాగుతుంది. శాసన మండలిలో వ్యవహార నిర్వహణ ఆంగ్లంలో జరగవచ్చు.

ఈ చట్టపు ప్రారంభంనుండి అయిదు సంవత్సరాలు గడిచిన మీదట రాష్ట్ర ప్రభుత్వం ఉత్తరువుద్వారా ఒక అధికార భాషా సంఘం (కమీషను) ఏర్పాటు చేయాలి. అందులో ఒక అధ్యక్షుడు, నలుగురు ఇతర సభ్యులు వుంటారు. వారిని రాష్ట్ర ప్రభుత్వం నియమిస్తుంది. కమీషను రాజ్యాధికార కార్యక్రమాలకు తెలుగుభాషను ఉపయోగించడంలో సాధించిన ప్రగతిని సమీక్షించి, ఈ క్రింది వాటిని గురించి రాష్ట్ర ప్రభుత్వానికి సిఫారసు చేయాలి. (ఎ) రాష్ట్రాధికార కార్యాలయాల్లో తెలుగు భాషను క్రమానుగతికంగా వుపయోగించడం. (బి) రాజ్యాధికార కార్యాలన్నిటికిని లేదా అందు వేటికైనా ఆంగ్లభాషను ఉపయోగించడంలో నిర్బంధాలు, (సి) తెలుగు భాషోపయోగానికి సంబంధించి, రాష్ట్రప్రభుత్వం యేవైనా ఆదేశించివుంటే వాటినిగురించి ఒక నివేదిక రాష్ట్రప్రభుత్వానికి అందజేయాలి. ఆ నివేదిక ప్రభుత్వం శాసనమండలి సమక్షాన వుంచాలి. ఆ నివేదికపై రాష్ట్ర ప్రభుత్వం అంతటికిగాని లేక అందలి కొన్ని భాగాలకుగాని, అనుగుణంగా ఆదేశాలు జారీచేయవచ్చును.

కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల శాసనాలు, ఆర్డినెన్సులు, నిబంధనలు వగైరాల తెలుగు అనువాదాలు రాష్ట్ర ప్రభుత్వం

నిర్దేశించిన తేదీన గవర్నరు అధికారం క్రింద గెజెటులో ప్రకటింపబడడంతో అధికారపూర్వక పాఠాలుగా భావింప బడాలి. శాసనమండలిలో తెలుగు అధికారభాషగా నిర్ణయించిన తర్వాత ప్రతిపాదింపబడే ప్రతి బిల్లు తెలుగు ప్రతితోబాటు ఇంగ్లీషు ప్రతి అందించాలి.

తెలుగు భాషకు అదనంగా ఉర్దూ, మరాఠీ, కన్నడ, అరవం, ఒడియా లేక యితర భాషలనుకూడా ఆయా అల్ప సంఖ్యాక భాషలు మాట్లాడేవారి సంఖ్యనుబట్టి వారి ప్రయోజ నానికై నిర్దిష్ట ప్రాంతాలలో, నిర్దిష్ట కార్యాలకు, నిర్దిష్ట కాలం వరకు ఉపయోగించాలని ఆదేశింపవచ్చు.

## తెలుగు అధికార భాషగా నిర్ణయించిన శాఖలు

ఈ శాసనం అమలుకు వచ్చిన తరువాత తెలుగు భాషను అధికార భాషగా అనువర్తింపజేస్తూ ప్రభుత్వం ప్రకటన చేసింది. తాలూకాస్థాయి వరకు ఈక్రింది శాఖలలో తెలుగును అధికారభాషగా అమలు జరుపవలెనని ఆదేశించింది:

1. వ్యవసాయశాఖ; 2. పశు సంవర్ధనశాఖ; 3. చీఫ్ ఇంజనీర్ (భవనములు, రోడ్లు); 4. వాణిజ్య పన్నుల శాఖ; 5. సహకారశాఖ; 6. విద్యాశాఖ; 7. ఆబ్కారీశాఖ 8. మత్స్యశాఖ 9. అటవీశాఖ. 10. దేవాదాయ, ధర్మాదాయశాఖ; 11. భారతీయ వైద్యశాఖ; 12. కార్మిక శాఖ; 13. పురపాలకశాఖ; 14. పంచాయతీరాజ్ శాఖ; 15. పోలీసుశాఖ; 16. కారాగారశాఖ: 17. పౌరకట్టడాలశాఖ (పబ్లిక్ వర్క్సశాఖ); 18. పౌరగ్రంథాలయశాఖ; 19. రిజిస్ట్రేషన్ స్టాంపులశాఖ, 20. రెవిన్యూశాఖ, 21. ట్రెజరీ అకౌంట్స్ శాఖ; 22. గిడ్డంగులశాఖ. 23. తూనికలు, కొలతల శాఖ,

24. సెటిల్‌మెంట్-సర్వేశాఖలు. 25. అగ్నిమాపకదళశాఖ, 26. రేవులశాఖ, 27. స్త్రీ సంక్షేమశాఖ.

ప్రభుత్వ సాధారణ పరిపాలనా శాఖ 25-5-67 న జారీచేసిన నెం. 464 జి.వో.లో తెలుగుతోబాటు అదనంగా ఉర్దూ, ఒడియా, తమిళం, కన్నడం, మరాఠీ భాషలనుకూడా, ఏయే కార్యక్రమాలకు ఉపయోగించవలెనో నిర్దేశించారు. జి.వో. 541 జి.ఏ.డి. 29-6-1970 న జారీచేసిన దానిలో పబ్లిక్ సర్వీస్ కమీషను పరీక్షలలో గ్రూపు 3 కు చెందిన అభ్యర్థులు ఇంగ్లీషుతోబాటు తెలుగులో కూడా జవాబులు [ఒక్క ఇంగ్లీషు భాషలో ప్రశ్నలకు మినహా] వ్రాయవచ్చునని ఆదేశించారు. జి.ఓ. 1870 విద్యాశాఖ 2-12-71 ద్వారా విద్యాశాఖలోని ఉద్యోగాలలోకి స్కూలుఫైనల్, ఇంటర్‌మీడియట్, బి. ఏ. తరగతులలో తెలుగు బోధనాభాషగా చదివినవారికి మాత్రమే అర్హత వుంటుందని ప్రకటించారు.

## సమీక్షా సంఘం నియామకం

1966 లో భాషా చట్టం శాసనం అయిన తర్వాత అప్పటికి అమలులోవున్న జి.వో.లు గాని, శాసనం అయిన తర్వాత జారీచేసిన ఆర్డరుల ప్రకారం ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ కార్యాలయాలలో తాలుకా స్థాయిలో తెలుగు అధికార భాషగా అధికారులు ఎంతవరకు అమలు జరుపుతున్నారో సమీక్షచేసి ప్రభుత్వానికి నివేదించుటకు శ్రీ పి. వి. నరసింహారావు (ఆనాటి విద్యామంత్రి), అధ్యక్షులుగా, సర్వశ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య, తులాబందుల నాగేశ్వరరావు, టి. రంగారెడ్డి, సలాఉద్దీన్ ఒవైసీ (వీరు శాసనసభ సభ్యులు), శ్రీ చెంగల్‌రెడ్డి,యన్. సోమయాజులు(వీరు కౌన్సిలు సభ్యులు), శ్రీ యస్. ఆర్. రామమూర్తి, ఐ.ఏ.ఎస్., (విద్యాశాఖ

కార్యదర్శి), శ్రీ వై. శ్రీనివాసరావు [ప్రభుత్వ అనువాదకుడు] సభ్యులుగా 10-11-67 న ప్రభుత్వం ఒక సంఘాన్ని నియమించింది. ఈ సంఘం ఆంధ్రప్రదేశ్‌లో శ్రీకాకుళం, విశాఖపట్నం, తూర్పుగోదావరి, పశ్చిమ గోదావరి, కృష్ణ, గుంటూరు, నెల్లూరు, చిత్తూరు, కడప, వరంగల్లు, హైదరాబాదు, కర్నూలు జిల్లాలు పర్యటనచేసి ప్రభుత్వ వివిధ కార్యాలయాలు, పురపాలక సంఘాలు, సమితుల వద్దకు వెళ్లి వారి రికార్డులు పరిశీలనచేసి తమ నివేదికను 1971 లో ప్రభుత్వానికి సమర్పించారు.

అప్పటికి తెలుగు అమలుజరుపబడుతున్న తాలుకాస్థాయిలో మాత్రమేకాక, జిల్లాస్థాయిలోనూ, రాష్ట్రస్థాయిలోనూ వెంటనే అమలు జరిపే ప్రయత్నం సాగించవలెనని, శాసనమండలికి కూడా వర్తింప చేయవలెనని, ముద్రాలేఖినులను (టైపురైటరులు) అధికంగాతయారు చేయించి అన్ని ఆఫీసులకు అందించవలెనని, లినోటైపుకూడా అమర్చి ముద్రణ సౌకర్యం పెంచవలెనని, తెలుగురాని సిబ్బందికి తగు శిక్షణ అవకాశాలు కలిగించవలెనని ప్రభుత్వ ఉద్యోగాలలో పబ్లిక్ సర్వీస్ కమీషను నిర్వహిస్తున్న పరీక్షలలో 1, 2, 3, గ్రూపులలో తెలుగు భాషకు అవకాశం యివ్వవలెనని, తెలుగు బోధనాభాషగా చదివినవారికి ఉద్యోగాలలో ప్రాధాన్యం యిస్తూ అవకాశాలు కలిగించవలెనని, అధికారభాష నిర్వహణకు సాధారణ పరిపాలన శాఖలో ప్రత్యేక విభాగం యేర్పాటు చేయవలెనని, పై అధికారులు ఆయా కార్యాలయాలు తనిఖీచేసినప్పుడు అధికారభాష విషయముకూడ పరిశీలన చేసేందుకు నిర్దేశించవలెనని, జిల్లాలో అధికారభాష సమీక్షించేందుకు, అనువాదాలలోను సాంకేతిక విషయాలలోను కలెక్టరుకు సహాయపడేందుకు జిల్లాలో ఒక కేంద్రీయసంస్థ వుండాలని, ఉర్దూ, తమిళం, కన్నడం, మరాఠీ మున్నగు అల్పసంఖ్యాక భాషలకు తగు రక్షణ కల్పించవలెనని

శాసనంలో ఉదహరించిన అధికారభాషా కమీషన్ను యేర్పాటు చేయవలెనని ఈ సమీక్షా సంఘం తమ నివేదికలో సూచించింది.

1973లో శ్రీ జలగం వెంగళరావు ముఖ్యమంత్రిగా యేర్పడిన ప్రస్తుత మంత్రివర్గము తాలూకా, అంతకన్నా క్రింది స్థాయిలోవున్న అన్ని కార్యాలయాలలోను విధిగా తెలుగును అధికారభాషగా అమలు జరుపుటకు నిశ్చయించింది. ప్రజలలో అందుకు తగినఉత్సాహం కలిగించుటకు ఆనంద సంవత్సరాదినాడు విద్యా శాఖా మంత్రి శ్రీ మండలి వెంకట కృష్ణారావు కార్యవర్గాధ్యక్షులుగా అఖిల భారత తెలుగు సాంస్కృతికోత్సవాలు నిర్వహించారు. దీనితోబాటు శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య అధ్యక్షుడుగా, శ్రీ యం. శ్రీనివాసులు రెడ్డి, యం. యల్. ఏ., శ్రీమతి టి. యన్. అనసూయమ్మ, యం.యల్,ఏ., శ్రీ వి. పి. రాఘవాచారి, యం. యల్. సి. శ్రీ తులాబందుల నాగేశ్వరరావులు సభ్యులుగా అధికార భాషా సంఘం (కమీషను) ను నియమించారు. ఉగాది నుండి పని సాగించడం జరిగింది.

ఈ కమీషను ఇంతవరకు 21 జిల్లాలలో పర్యటించింది. కొన్ని జిల్లాలలో తాలూకాలలో, సమితులలో పర్యటన జరిపినది. కర్ణాటక, తమిళనాడు రాష్ట్రాలు అధికార భాషగా అమలుజరుపుతున్న తీరుతెన్నులు పరిశీలించింది. అధికార భాషగా శాసనం, అందుపై నేటివరకు చేసిన ప్రకటనలు, కేంద్ర ప్రభుత్వం భాషా విధానం, పార్లమెంటు చేసిన తీర్మానాన్ని ఆమోదిస్తూ ప్రకటించిన ప్రకటనలను, వీటినన్నింటిని కలిపి ప్రజలకు, అధికారులకు, అనధికారులకు అందుబాటులో వుండుటకు ఒక గ్రంథం 1975 లో ప్రకటించడం జరిగింది.

రాష్ట్రాలలోని భాషలను పరిపాలనా భాషలుగా అమలు జరుపుటకు కేంద్ర, రాష్ట్ర శాసనాలు ఆయా భాషలలోనికి అనువదింపవలసివుంది, అందుకు కేంద్రంలో అధికారభాషా కమీషను

నొకదానిని నియమించారు. ఆయా రాష్ట్రాలు కేంద్ర శాసనాలను తమ భాషలలోనికి అనువదించుకొని పై కమీషను ఆమోదం పొందవలసి వుంది. అందుకు ప్రతి రాష్ట్రం నుండి ఆ భాషకు సంబంధించిన ఒక సభ్యుని నియమించుకొన్నారు. ఆంధ్ర ప్రదేశ్ అధికార భాషా శాసనం ప్రకారం 6వ విధి ననుసరించి రాష్ట్రపరమైన శాఖలకు సంబంధించి చేయబడిన శాసనాల తెలుగుప్రతులు గవర్నరు అధికారపూర్వక పాఠాలుగా ప్రకటించవలెననీ వుంది. ఇంతవరకు 1960 నుండి ఆంధ్రప్రదేశ్ శాసనసభలోని బిల్లులు ఎప్పటికప్పుడు తెలుగులో ప్రకటింపబడుతూ, ఇంగ్లీషు ప్రతితోబాటు శాసన సభలకు అందజేయబడుతున్నవి. చట్టం రూపం దాల్చిన తర్వాత కూడా తెలుగు పాఠాలుగా ఆంధ్రప్రదేశ్ గెజెటులో ప్రకటింపబడుతూనే వున్నవి.

ఇది ఇటులుండగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం శాసనాల అనువాద సంఘాన్ని 1966 లో నియమించింది. ఈ అనువాద కార్యక్రమం అమలుజరుపుటలో ఆంధ్రప్రదేశ్ పని యేమీ సంతృప్తిగా లేదు. అయితే కేంద్రప్రభుత్వ ప్రాంతీయ భాషలను ప్రోత్సహించుతామని అంటూ ఇంతవరకు వివిధ రాష్ట్రాలు అనువదించిన శాసనాలను అధికారికంగా ధ్రువపరిచే ప్రయత్నము చేయనేలేదు. కేంద్ర శాసనాల అధికార అనువాదాల శాసనం (1973 లోని 50 వ చట్టం) 1973 లో పార్లమెంటు ఆమోదించింది. దీనినిబట్టి రాజ్యాంగం 8వ అనుబంధంలోని వివిధ (హిందీ మినహా) భాషలలో కేంద్ర శాసనాల అనువాదాలు రాష్ట్రపతిచేత అధికార గెజెట్‌లో ప్రకటింపబడినచో అవి అధికారపాఠాలుగా పరిగణింపబడుతవి అని శాసించారు. 1963 సం॥లో పార్లమెంటు చేసిన అధికార భాషా శాసనంవల్ల హిందీ శాసనాలు ప్రచురణాధికారము లభించినది. అయితే ఈ శాసనం 1 (2) సెక్షను ప్రకారం అసలు ఈ శాసనాన్ని అమలోనికి వచ్చినట్లు ప్రకటించినపుడే అమలుకు వస్తుంది. అందుచేత శాసనం చేయ

బడినా అమలుకు వచ్చినట్లు ప్రకటింపబడనందున ఇంతవరకు వివిధ రాష్ట్రాలు శ్రమచేసి తమతమ భాషలలోనికి అనువదించుకొనినా, ముద్రించినా—అధికార అనువాద పాఠాలుగా పరిగణింపబడే యోగ్యత పొందలేదు. దీనినిబట్టి రాష్ట్రాలలో ఆయా భాషల అమలుకు ఎంత అవరోధంగా పని సాగుతున్నదో బోధపడుతున్నది. ఇంత చేసినా-చేయనివారి సంగతి చెప్పనే పని లేదనుకోండి—చేసినవారి పనికూడా ఆంధ్రప్రదేశ్ లోని రాష్ట్ర శాసనాలకు ఎంత యోగ్యత కలిగిందో, కేంద్ర శాసనాల అనువాదాలకు కూడా భారతదేశం మొత్తంమీద అంతే యోగ్యత లభించింది. ఈ విషయంలో రాష్ట్రప్రభుత్వాలు వెంటనే కేంద్రప్రభుత్వంచేత ఈ 1973 లోని 50 వ శాసనం అమలుకు వచ్చినట్లు ప్రకటింపజేయడం అత్యావసరం. అది జరగనిదే వివిధ భాషలు అధికారభాషలుగా సాగజాలవు. అంతమాత్రాన అనువాదంచేయని మన రాష్ట్రం సంతృప్తిచెందే అర్హత వుందనుకోవడం సరికాదు. త్వరత్వరగా అనువదించి అచ్చు వేసివుంచితే ఒక్కసారి అన్నింటిని అధికార పాఠాలుగా ప్రకటించవచ్చు. అప్పుడు ప్రారంభించితే దాహం కలిగినప్పుడు బావి త్రవ్వ ప్రయత్నించినట్లవుతుంది. కేంద్రప్రభుత్వం తీవ్రమైన వత్తిడి తెస్తున్నది. ఇది త్వరలో సాధింపగలమని ఆశిస్తున్నాం. తెలుగు అనువాదాల పని చురుకుగా సాగవలసివుంది. అనువదింపబడిన రాజ్యాంగం వెంటనే ముద్రించవలసివుంది.

అట్లే వివిధ రాష్ట్రాలలో తమతమ మాతృ భాషలలో అనువాదం చేశారు. అనువాద పుటలు, అచ్చుపుటలు ఈ విధంగా వున్నవి: అస్సామి 136 (6), బెంగాలి 239(48)గుజరాతి 1950 (134), కన్నడం 37 (26), మలయాళం 692 (59), మరాఠీ 1046 (54), ఒడియా 846 (79), పంజాబీ 110 (14), తమిళం 58 (30), తెలుగు 55 (53), ఉర్దూ 993 (142). వివిధ రాష్ట్రాలలో ఆయా భాషలు అధికార భాషలుగా అమలు

జరుపుటలో పూర్తి ప్రోత్సాహం కలిగించవలెనని ప్రధాన మంత్రికి,హోం మంత్రికి స్వయంగా విజ్ఞప్తులు 1974 నవంబరులో యివ్వడం జరిగింది.

కోడ్‌లు, మాన్యువలు, స్టాండింగు ఆర్డర్లు, ప్రభుత్వపు ఉత్తర్వులు వెంటవెంటనే తెలుగులో అనువదించితే క్రింది కచేరీలలో శ్రమ తగ్గుతుంది. కావున వాటిని అనువదించుటకు, శాసన సభలో చేయబడిన బిల్లులను, ఇంగ్లీషులో శాసనాలుగా ప్రకటించిన వెంటనే తెలుగు శాసన ప్రతులు కూడా ప్రకటించుటకు యేర్పాట్లు చేయబడినవి. జి. వో. నెం. 670 ప్రకారం కమీషను అజమాయిషీలో అనువాద విభాగం ఏర్పాటు చేయబడింది. ఈ అనువాదాలు అధికార పూర్వకంగా వుండకపోయినా సమాచారానికి ఉపయోగపడుతవి. వాటిని ప్రజలు ఉపయోగించుకోవడానికి అనువుగా వుంటవి. జి. వో. లు. జారీచేసిన వెంటనే తెలుగులోనికి అనువాదం చేయబడి రెండూ ఒకేసారి ప్రకటింపబడుటకు ప్రభుత్వం పై ఉత్తర్వు జారీచేసింది.

ఇది ఇట్లుండగా కేంద్ర ప్రభుత్వంకూడా భాషా విధానంపై పార్లమెంటు చేసిన తీర్మానాన్ని 1968 జనవరి 18 వ తేదీన తమ తీర్మానంగా ప్రకటించింది.

అందులో ప్రాంతీయ భాషలను గురించి ఈ విధంగా చెప్పారు:

" భారత రాజ్యాంగంలోని ఎనిమిదవ అనుబంధంలో పేర్కొనబడిన భారతీయ భాషలన్నింటి సంపూర్ణ వికాసానికి నిర్దిష్ట చర్యలు తీసుకోవడం దేశంయొక్క విద్యా సాంస్కృతిక అభివృద్ధికి ఆవశ్యకం కనుక హిందీతోపాటు ఇతర భారతీయ భాషలు సంపన్నములై ఆధునిక విజ్ఞాన ప్రచారానికి పటిష్టములైన సాధనాలయ్యేటట్లుగా వాటి సమగ్ర వికాసానికి భారత ప్రభుత్వం రాష్ట్ర ప్రభుత్వాలతో కలిసి ఒక సమగ్ర పథకాన్ని రూపొందించి అమలుజరపాలి.

రాజ్యాంగంలోని ఎనిమిదవ అనుబంధములో పేర్కొన బడిన అన్ని భారతీయభాషలు మరియు ఇంగ్లీషుభాష,అఖిల భారత సర్వీసులలోను, కేంద్ర ఉద్యోగాలలోను నియామకాలకై ఎన్నికచేయడానికి ప్రత్యామ్నాయ బోధన భాషగా అనుమతింపబడాలి. భాషలలో పరీక్షా విధానం ఎలాఉండాలి? ఎంతకాలంలో జరగాలి? ఏ విధంగా జరగాలి? అనే విషయాలలో యూనియన్ పబ్లిక్ సర్వీస్ కమీషను సలహా గైకొని ఇది అమలు జరపబడాలి."

ఆంధ్రప్రదేశ్ పబ్లిక్ సర్వీస్ కమీషను అజమాయిషీలో జరుగుతున్న గ్రూపు 1, గ్రూపు 2, మరియు గ్రూపు 3 పోటీ పరీక్షలలో ఇంగ్లీషు మాత్రమే వుంటున్నదనీ, దానిని మార్చవలెననీ, గ్రూపు 3 వారికి జి. వో. జి. ఎ. డి. 29-6-70 లో నిర్దేశించిన విధంగా గ్రూపు 1, గ్రూపు 2 సర్వీసులను నిర్వహించే పోటీ పరీక్షలలో ఇంగ్లీషు వ్యాసరచన మినహా మిగతా అన్ని పరీక్షా పత్రాలు అభ్యర్థులు వారివారి బోధనాభాష తెలుగు అయినా కాకపోయినా దానితో సంబంధం లేకుండా ఐచ్ఛికంగా తెలుగులోనే వ్రాయటాన్ని అనువర్తింపజేయాలని సిఫారసు చేసింది. గ్రూపు 1 మరియు 2 తరగతులకు కూడా అనువర్తించుతూ. జి. వో. 77, జి. ఎ. డి., 20-1-72 జారీ చేశారు. తెలుగు బోధనాభాషగా చదివిన విద్యార్థులకు ఉద్యోగావకాశాలలో కొంత ప్రాధాన్యతయిచ్చే విషయం మంత్రిమండలి నిర్ణయించి పబ్లిక్ సర్వీస్ కమీషనుకు పంపింది.

ఇంతవరకు ఉత్తరప్రదేశ్, బీహారు, పశ్చిమ బెంగాలు, ఒరిస్సా, తమిళనాడు, కేరళ, కర్ణాటక, మహారాష్ట్ర, రాజస్థాన్, మధ్యప్రదేశ్, గుజరాత్, అస్సాం, హరియానా, జమ్మూ-కాశ్మీర్, పంజాబ్, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాలు తమతమ భాషలను అధికార భాషలుగా నిర్వహిస్తున్నాయి.

ఆంధ్రప్రదేశ్, అస్సాం, జమ్మూ-కాశ్మీర్, మణిపూర్, మేఘాలయ, మైసూర్, నాగాలాండ్, ఒరిస్సా, పశ్చిమ బెంగాల్ రాష్ట్రాల పబ్లిక్ సర్వీస్ కమీషనులు తమ పరీక్షలు అచ్చంగా ఇంగ్లీషులోనే నిర్వహిస్తున్నారు. ఉత్తరప్రదేశ్, బీహార్, హరియానా, మధ్యప్రదేశ్, రాజస్థాన్, ఇంగ్లీషు-హిందీల్లోనూ, గుజరాత్ రాష్ట్రం హిందీ లేక ఇంగ్లీషు లేక గుజరాతీలోనూ, కేరళ రాష్ట్రం ఇంగ్లీషు, కన్నడం, మళయాళం, తమిళంలోనూ, తమిళనాడు ఇంగ్లీషు-తమిళంలోనూ, త్రిపుర ఇంగ్లీషు, బెంగాలీ, హిందీభాషలలోనూ నడుపుతున్నారు.

రాజ్యాంగంలో ఉదాహరించిన అన్ని భాషలలోనూ, కేంద్ర పబ్లిక్ సర్వీస్ కమీషను పరీక్షలలో ప్రశ్నపత్రాలకు జవాబు వ్రాయవచ్చునని 1968 జనవరి 18న పార్లమెంటు, కేంద్రప్రభుత్వమూ నిర్ణయించినా చురుకుగా సాగడంలేదు. ఈ విషయం పరిశీలన చేయవలసిందిగా కేంద్ర ప్రభుత్వం యూనియన్ పబ్లిక్ సర్వీస్ కమీషనును కోరడంతో కమీషను ఇందుకు శ్రీ కొఠారి అధ్యక్షతను ఒక కమిటీ యేర్పరచినది. వారి నివేదిక ఇప్పటికే ఆలస్యం అయింది. ఇప్పుడు జరుగనున్న ఐ. ఏ. ఎస్. పరీక్షలలో 1972 సంవత్సరం అస్సామీలో 10 మంది, బెంగాలీలో 55, హిందీ 648, గుజరాతీ 19, కన్నడ 17, కాశ్మీరీ 2, మలయాళం 20, మరాఠీ 12, ఒడియా 10, పంజాబీ 67, సింధీ 1, తమిళం 95, తెలుగు 20, ఉర్దూ 49 మంది ఆయా భాషలను ఐచ్ఛికభాషగా ఎన్నుకున్నారు. వీరంతా అసలు హాజరైనవారిలో 10 శాతంగావున్నారు. ఆధునిక భాషలకు ప్రోత్సాహం ఇస్తామన్న కేంద్రప్రభుత్వం 1975-76 వార్షిక ప్రణాళికలో హిందీకి 190 లక్షలూ, ఉర్దూకు 69 లక్షలూ, సంస్కృతానికి 62 లక్షలూ, మరి మిగిలిన అన్ని భాషలకూ కలిపి 51 లక్షల రూపాయలు కేటాయించారు.

తెలుగును అధికారభాషగా చేయబడిన వెంటనే 1. తెలుగు భాషను ఆధునీకరణ చేయుటకు, 2. తెలుగు బోధనా భాషగా

విశ్వ విద్యాలయాలు అమలుజరపుటకు అవసరమైన పాఠ్య పుస్తకాలు అనువదించి ప్రకటించుటలో అన్ని ప్రయత్నాలు చేయుటకు, 3. వీలైనంత త్వరలో తెలుగు పరిపాలనా భాషగా అమలు జరుపుటలో ప్రభుత్వంతో సహకరించి నిర్వహించుటకు తెలుగు భాషకు ప్రాంతీయ భాషా సంస్థ నొకదానిని నిర్మాణం చేయుటకు అనువగు సూచనలు చేయుటకు శ్రీ జె. పి. ఎల్. గ్విన్, ఐ. సి. యస్. అధ్యక్షులుగా 1966 డిసెంబరు 28వ తేదీన ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం ఒక కమిటీని వేసింది. ఆ కమిటీ వివిధ సమస్యలు పరిశీలనచేసి ఒక నివేదికను అందించింది. అందులో తెలుగు రాని ప్రభుత్వ సిబ్బందికి తెలుగు బోధన తరగతులు నడపవలెనని, తెలుగు భాష అభివృధికి ఒక సంస్థ యేర్పరచవలెనన్నారు. తాలూకా,జిల్లా స్థాయిలలోనేగాక అటుపర్వాత రాష్ట్రస్థాయిలోకూడా తెలుగును అధికార భాషగా అమలు జరుపుటలో యేమీ ప్రతిబంధకాలులేవని, అయితే అందుకు కావలసిన వాటిని ముందే క్రమపద్ధతి ప్రకారం యేర్పాటుచేసుకోవాలని అన్నారు. ఇందులో యేర్పడబోవు పరిశోధనా శాఖ ఇపుడు స్థానిక పరిపాలనలో, ఇతర పరిపాలనా విభాగాలలో తెలుగు వాడబడుతున్నవిధం పరిశీలనచేసి ఇప్పటికి స్థిరత్వం పొందిన పదాల జాబితానుండి ప్రామాణిక పదజాలం తయారుచేసి ప్రభుత్వానికి అధికార భాష అమలు జరుపుటలో సహాయం చేయవలెనని సిఫారసు చేశారు. ఈ అన్ని పనులు నిర్వహించుటకు ప్రభుత్వం తెలుగు అకాడమీని స్థాపించింది. కేంద్ర ప్రభుత్వం ఈ తెలుగు అకాడమీ చేసే కార్యకలాపాలకు ఒక కోటి రూపాయలు విరాళంగాయిచ్చింది. తెలుగు ఆధునీకరణ చేయడం లోనూ, అధికార భాషగా అమలు జరుపుటకు కావలసిన ప్రయత్నంలోనూ తెలుగుభాషపై పరిశీలన చేయడంలోను ఎక్కువ ప్రగతి సాధించ లేకపోయింది.

ఆంధ్రప్రదేశ్ అధికారభాషా శాసనం వచ్చిన సమయంలోనే బోధనాభాషగా తెలుగులో ఇంటర్ మీడియట్

ప్రారంభించడం, అటుపై బి.ఏ., బి.కాం., బి.యస్‌సి.లలో కూడా తెలుగు బోధనాభాషగా చేయడం జరిగింది. విద్యావిషయకంగా భారత దేశంలో విద్యావిధానాన్ని సమూలంగా పరిశీలనచేసి కొఠారి కమిషను తన నివేదికను భారత ప్రభుత్వానికి సమర్పించింది. దానిననుసరించి కేంద్రప్రభుత్వం తమ జాతీయ విద్యావిధానాన్ని నిర్వచిస్తూ ప్రాథమిక, మాధ్యమిక, ఉన్నత, కళాశాలా, ఆచార్య స్థాయిలలో కూడా మాతృభాషను బోధనాభాషగా నిర్దేశించడం జరిగింది.

బోధనాభాషగా మాతృభాషలను అమలు జరుపుటలో కొఠారి కమిషను విద్యావిషయిక చర్చలకు వచ్చినప్పటికే ఇంటర్‌మీడియట్ ప్రారంభించవలెననీ, అందు బోధనాభాషగా తెలుగు అమలు జరుపవలెననీ ప్రథమంగా నిశ్చయించిన రాష్ట్రం ఆంధ్రప్రదేశమే. 1974 వ సంవత్సరంలో కళాశాల స్థాయి కూడా పూర్తిఅయింది. విద్యాశాఖాధికారులు, విశ్వవిద్యాలయాల ఉపాధ్యాయులు అందరు కలిసి 1965 లో పట్టభద్రానంతర తరగతులలోకూడా తెలుగునే బోధనాభాషగా అమలుజరపాలని నిర్ణయించారు. అయినా విశ్వవిద్యాలయాల ఉదాసీనతవల్ల అది వెనుకబడిపోయినది. ఆంధ్రప్రదేశ్ లో వెనుకబడిపోయినా ఇతర విశ్వవిద్యాలయాలలో చురుకుగా సాగిస్తూనే వున్నారు. విశ్వభారతి, రవీంద్రభారతి, బెంగాలీలోను, గుజరాత్, సౌరాష్ట్ర, యస్.యస్.డి.టి. దక్షిణ గుజరాత్, గుజరాత్ విద్యాపీఠ్, ఆగ్రా, ఏ. పి. సింగ్, కాశీ (బెనారస్), భోపాల్, బీహార్, ఘోరక్‌పూర్, గురునానక్, ఇందిరకళాసంగీత్, ఇండోర్, జబల్‌పూర్, జీవాజీ, జోధ్‌పూర్, దర్భాంగ, కాన్పూర్, లక్నో, మీరట్, నాగపూర్, పాట్నా, రాజస్థాన్, రవిశంకర్, సాగర్, సౌరాష్ట్ర, దక్షిణ గుజరాత్, ఉదయపూర్, వి. సంస్కృత, విక్రమ్, గురుకుల్ కాంగ్డీ, కాశీ విద్యాపీఠ్, ఢిల్లీ, మిథిల, విశ్వవిద్యాలయాలలో హిందీలోనూ; నాగపూర్,

యస్.యస్.డి.టి., విశ్వవిద్యాలయాలలో మరాఠీలోనూ; గురు నానక్ విశ్వవిద్యాలయంలో పంజాబీలోనూ, పట్టభద్రానంతర బోధన జరుపుతున్నారు. ఈ వివరాలు 1973 మార్చి 31 వరకు. దీని తర్వాత మరికొన్ని (ఆంధ్రప్రదేశ్‌లో మాత్రంకాదు) విశ్వ విద్యాలయాలు తమ మాతృభాషలో బోధన కొనసాగిస్తున్నారు.

బోధనభాష తెలుగులోనే సాగించడమే కాకుండా తెలుగు బోధనాభాషగా చదివిన వారికి రాష్ట్రప్రభుత్వ ఉద్యోగాల ప్రాధాన్యత చూపకుండా తెలుగు అధికారభాష అమలు జరుగుట ఏ విధంగా సాధ్యమౌతుంది?. ఆంధ్రప్రదేశ్‌లో 5 సంవత్సరాలనుండి ఇంటర్, బి. ఏ.లలో తెలుగు బోధనాభాషగా సాగింది. ఈ సంవత్సరం ఇంగ్లీషు బోధనాభాషగా అమలు జరుపుటకు ప్రభుత్వ కళాశాలల్లోకన్నా ప్రైవేటు కళాశాలల్లో అనుమతి విచ్చలవిడిగా ఇచ్చారు. 5 సంవత్సరాలనుండి బోధనా భాషగా చదివిన అభ్యర్థులకు ఉద్యోగాలలో ప్రాధాన్యం యిస్తూ అదనంగా కొన్ని మార్కులు ఇస్తామనకపోతే లాభంలేదు. కనీసం ఈ సిద్ధాంతం అయినా ప్రభుత్వం అంగీకరించినందుకు సంతోషిద్దాం. అంతమాత్రాన చాలదు, అది అమలుజరపాలి. మంత్రిమండలి దీనిని అంగీకరించి, పబ్లిక్ సర్వీసు కమీషన్‌కు పంపారు. వారేమిచేస్తారో అనే భయం లేకపోలేదు. కాని వారూ అంగీకరిస్తారనే ఆశిద్దాం.

ప్రాథమిక, ఉన్నత పాఠశాలా స్థాయివరకూ తెలుగు బోధనా భాషగా యెటూ అమలు జరుగుతూనే వున్నది. ఇక ఇంటర్‌మీడియట్. బి. ఏ., బి. కాం., బి. యస్‌సి. డిగ్రీ పరీక్షలలో తెలుగులోకి శాస్త్రగ్రంథాలు అనువదించడం, అందించడంలో తెలుగు అకాడమీ పని ప్రశంసనీయంగా వున్న దనక తప్పదు. ఆకాడమీ ఇంతవరకు తెలుగులో దాదాపు

300 పాఠ్య పుస్తకాలు ప్రచురించింది. శాస్త్రీయ పదావళి తయారు చేయడంలో అనువాదంలో కొత్త అయినందున ప్రావీణ్యం రాలేదనీ, ఎవరైనా అన్నా ప్రయత్నంలో కృషి సాగుతున్నందుకు సంతసించాలి. అయితే పండిత పామరులకు సంతృప్తి కలిగించే విధంగా పదజాలాన్ని సేకరించవలసివుంది. ఇప్పటి కృషిని మించి ముందుకు పోవాలి. సర్వజన ఆమోద యోగ్యంగా అనువాదాలు, పదాలు వుండాలి. సాంకేతిక శాస్త్రాలకు సంబంధించి 10 శాఖలలో పదకోశాలు ప్రచురించి పరిశీలిస్తున్నారు. ఆంధ్ర విశ్వకళాపరిషత్తు వ్యుత్పత్తి అర్థాల నిఘంటువును తయారుచేస్తున్నది. కొంతభాగం ముద్రణ అయింది. ఈ ప్రయత్నం పూర్తిగా జరిగి ఆ నిఘంటువు త్వరలో ప్రచురణకావడం ముఖ్యం. అందుకు ప్రభుత్వం సహకరించడం అవసరం.

## భాష-పరిభాష

ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం 1965 ఆగస్టు 20 తేదీ విద్యా శాఖ జి. వో. 2265 ద్వారా శ్రీ ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారి అధ్యక్షతన ఒక సంఘం నియమించి జాతీయం చేయబడిన పాఠశాలా పాఠ్య పుస్తకాల శిష్టవ్యవహారికం యేవిధంగా వాడవలెనో నిర్దేశించవలసిందిగా కోరారు. ఆ సంఘమువారు భాషేతర పాఠాలను, రెండవ భాష పాఠాలను మొదట శిష్టవ్యవహారికంగా వాడవలసిందిగ చేసిన సూచనలు 1967 ఫిబ్రవరి 25వ తేదీన ప్రభుత్వంఅంగీకరిస్తూ మెమోద్వారా జారీచేసింది. ఈ సిఫారసుల మేరకు విద్యా శాఖ వారు భాషా పాఠాలలో సరళ గ్రాంధికంనూ, ఇతర పాఠ్య పుస్తకాలలో శిష్టవ్యవహారికం వాడుచున్నారు. తెలుగు అకాడమీ వారు తమ పుస్తకాలలో శిష్టవ్యవహారికానికొక రూప కల్పనచేశారు. శ్రీ యస్. ఆర్. రామమూర్తి అధ్యక్షతన 1973 లో

నియమింపబడిన ప్రభుత్వ జాతీయ గ్రంథాల కమిటీ కూడా ఈ పై విధానాన్ని ధృవపరిచింది.

పి.హెచ్.డి. కి సమర్పించు పరిశోధనా వ్యాసాలు వ్యవహారిక భాషలో వ్రాయ వచ్చని సిఫారసుచేస్తూ శ్రీ పురిపండ అప్పలస్వామి 11-1-71 న ఆంధ్ర విశ్వకళా పరిషత్ అకడమిక్ కౌన్సిలులో ప్రతిపాదించగా ఆ తీర్మానం అంగీకరించడం శ్రీ యం. ఆర్. అప్పారావు అధ్యక్షులుగా ఒక సంఘాన్ని నియమించడం జరిగింది. ఆ సంఘం వ్యవహారిక భాషను కళాశాలల్లో ఉపయోగించవలెనని సిఫారసు చేస్తూ 5-7-73న నివేదిక సమర్పించింది. ఈ నివేదికను గుంటూరులో జరిగిన సెనెటు సమావేశంలో ఆంధ్ర విశ్వకళా పరిషత్తు అంగీకరించింది.

ప్రభుత్వ వ్యవహారాలలో శిష్టవ్యవహారికం అనేది కాకుండా సామాన్యజన భాషలో వ్యవహరించవలసివుంటుంది. భావం ప్రస్ఫుటంగా వ్యక్తంకావడం పరిపాలనలో ఉన్న అవసరం. నిర్ద్వందంగా వుండడం మరింత అవసరం. ప్రజలకు సులభంగా బోధపడడం ప్రధాన ధ్యేయం. వీటిని సంతృప్తిపరిచే విధంగా వుండే భాషలో వ్యవహారం జరగాలి.

ఇక పరిభాష విషయం ఒకమాట చెప్పవలసివుంది. వెంటనే ఇంగ్లీషు పదానికి తెలుగుపదం తెలియకపోయినా, స్ఫురించక పోయినా తెలుగు వాక్యాలలో ఇంగ్లీషుమాటను తెలుగు అక్షరాలతో మొదటిరోజులలో వ్రాయవచ్చు. తాత్కాలికంగా అంటే అలవాటు పడేంతవరకు, స్ఫురణకు వచ్చేంతవరకు. దీనికితోడు వివిధ జిల్లాలలో ఒకపదానికి వేరువేరుగా వాడుకపదాలున్నవి. ప్రతి జిల్లాలోనూ, అన్ని ప్రాంతాలలోనూ వాడబడే పర్యాయ పదాలు ప్రాంత ప్రాంతానికి మారవచ్చును కాని అవి మరుగు తగలడంగాని, మరుగుపడడంగాని జరిగితే భాష అభివృద్ధి కాదు. సంపన్నం కాజాలదు. అందువల్ల భాషకు తీరని నష్టం

సంఖవిస్తున్నది. అందుకే ప్రతి ప్రభుత్వ శాఖలోని వారు నేడు వాడుచున్న ఇంగ్లీషు పదాల జాబితా తయారుచేసుకొని వాటికి యేయే ప్రాంతాలలో యేపదం వాడుతున్నారో, ఇంకా వాని కున్న పర్యాయ పదాలుకూడా సేకరించి పంపవలసిందిగా జిల్లా అధికారులను, క్రింది అధికారులను, పెద్దలను, పిన్నలను భాషాభిమానలను కోరడం జరిగింది. ఇపుడు కూడా కోరుతున్నాం. ఆ విధంగా వివిధ కార్యాలయాలవారు పంపిన పదజాలం— ఈనాడు క్రోడీకరణ జరుగుతున్నది. ఇవి మాత్రమే కాకుండా ఇంకా రావలసివున్నవి. ఇవి అన్నీ సమకూర్చుకొని ఈనాడు వాడుకలోవున్న పదపారిజాతం పది సంవత్సరాల క్రితం తయారుచేసినందున అలవాటువల్ల, వాడుకవల్ల, తెలుగు అధికార భాషగా వస్తున్నదన్న ఆసక్తివల్ల, ఇంటర్మీడియట్ నుండి తెలుగు బోధనాభాషగా 1969 నుండి సాగింపబడుతున్నందువల్ల పలు పదాలు ప్రయోగంలోకి వచ్చినవి. తెలుగు పదాలను గురించి తెలుగు అకాడమీ వారు కరీంనగర్, కడప, గుంటూరు జిల్లాలలో జరిపిన విస్తృత పరిశీలనవల్ల అనేకమాటలు ప్రజాబాహుళ్యపు నుడికారంనుండి బయటపడుతున్నవి. ఈ ప్రయత్నం ప్రతిజిల్లాకు జరుపవలసివున్నది. వీటిని అన్నింటిని సమగ్రంగాను, శాఖలవారిగాను కర్ణాటక, తమిళనాడు ప్రభుత్వాలు తమ తమ భాషలలో ప్రచురించినట్లుగా సంగ్రహంగా చిన్న పుస్తకాలుగానూ ప్రచురించవలసిన అవసరం వుంది. అందుచేత తెలుగుదేశంలోని నాలుగు చెఱగుల నుండి సామాన్య జనం అనుదినం వాడుకంటూ నిత్య జీవితరంగం లోని వ్యవహారంలో కలిసిపోయిన వివిధ అన్యభాషా పదాలకు సరితూగగల పదాలు ఏరి కూర్చి ప్రచురించవలసివుంది. అంతే కాకుండా తెలుగుభాష ఇంతవరకు సాహిత్యభాషగా మాత్రమే వుంది. బోధనాభాషగా ప్రవేశపెట్టడంతో బోధనలో రావలసిన శాస్త్రీయ, సాంకేతిక రంగాలకు కూడా సరిపడగల తెలుగు పదాలు అమలు జరుపుకోవడంతో నిత్యవ్యవహారంలో

వాడుతున్న తెలుగుపదాలు జనసామాన్యంలో వాడుతున్న పదజాలం సమీకరింపబడి గ్రంథస్థం కావలసివుంది. ఇప్పటికే వాడుకలోవున్న రేడియో, రైలు, తహసీలు, జమాబంది మున్నగువాటిని తెలుగులో వాడుకోవడంవల్ల భాష సంపన్నం అవుతుంది. కాని బలహీనపడదు. తమకు తెలిసినంతవరకు ఆయా ప్రాంతాలలోవాడబడే పర్యాయపదాలు ఏరి కూర్చి తెలుగు భాషను ప్రజల భాషగా సంపన్నం చేయాలి.

## లిపి సంస్కరణ

తెలుగు లిపి సంస్కరణ ప్రయత్నంకూడా జరిగింది. పేరుపొందిన ప్రముఖ చరిత్ర పరిశోధకులు శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారి అధ్యక్షతన ఒక సంఘం నియమింపబడింది. ఆ నివేదిక సమర్పింపబడినది. అటుతర్వాత 1971 లో ప్రభుత్వం ఒక గోష్ఠి జరిపింది. ఆ గోష్ఠిలో జరిగిన చర్చలను, సారాంశాలను పరిశీలనచేసేందుకు ఒక ఉపసంఘాన్ని నియమించారు. ఆ ఉపసంఘం, తెలుగు అకాడమీలు కలిసి పరిశీలన చేస్తున్నాయి.

## తెలుగు టైపురైటర్లు, లినోటైపు

తెలుగు టైపురైటర్లు, సంక్షిప్తలిపి :—అధికారభాష మందకొడిగా అమలుజరపడానికిసాకుగా టైపు మిషనులు లేకపోవడం చూపుతారు. ఇది సాకుగా తప్పించుకోవటానికి తమకున్న అలవాటునుండి అధిగమించలేక చెబుతున్న ఈ వాదనలో కొంత యదార్థం లేకపోలేదు. అందువల్ల టైపురైటర్ల తయారీ, సరఫరాలను దశలవారిగా పద్ధతి ప్రకారం యేర్పాటు చేయాలి. అయితే ఇప్పటికివున్న టైపురైటర్లు అన్నీ కలిసి 400 కన్నాలేవు. 1974–75లలో 1975–76లలోనూ చేర్చి 500 మిషన్లు కొనుటకు 15 లక్షల చొప్పున మంజూరు

చేయబడింది. కాని 80 కన్నా ఇప్పటికి లభ్యమయ్యేటట్లు లేదు. అందుచేత ఈ మొత్తం కాలదోషం పట్టకుండా ముందు సంవత్సరంలో కొనుటకు ఆర్డర్లు పెట్టి వుంచారు. అయితే ఇవి అన్ని మిషనులూ అన్ని ఆఫీసులకూ లభించేంతవరకూ ఆగకుండా వాటితోనైనా ప ని సా గి ం చ వ ల సి ం ది. ఇట్లు వాటితో పనిసాగిస్తూ టైపు మిషన్లకై కృషి సాగించాలి. టైపురైటర్ల విషయంలో త్వరత్వరగా చేయుటకున్నూ లిపి యింతకన్నా అందంగా వుండుటకుగానూ కృషి చేయవలసివుంది. దీనితోపాటు సంక్షిప్త లిపి శిక్షణ కార్యక్రమం, సంక్షిప్తలిపిని ఆధునీకరణ చేయవలసి వుంది.

లినో టైపు మిషన్లు కొనాలి. ఈ విషయంగా 1966నుండి కృషి సాగింది. లినో టైపు కీబోర్డు తయారీ, మేగజైనుల విషయంలోనూ వివరాలు లినోటైపు కంపెనీతో 1971 లో సంప్రదింపులు జరిగినవి. ఈ కీబోర్డు మేగజైనుల విషయంలో ఇండోనిప్పన్ కంపెనీ వారి సహకారంతో మాట్రిక్సుల ప్రతిరూపం నమూనాలు తయారు చేయడం వాటిని బొంబాయిలో ప్రదర్శించడం జరిగింది. కంపెనీవారు మిషను ఖరీదు రెండు లక్షలు అవుతుందని ఎనిమిది మిషన్లు ఆర్డరు యిస్తే చేస్తాం అన్నారు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తమ కేంద్ర ముద్రణాలయం తరపున నాలుగు మిషనులు, తెలుగు అకాడమీ తరపున నాలుగు మిషనులు కొందామని నిర్ణయించారు.

కాని చివరకు తెలుగు అకాడమీవారు తాము అనుకున్న నాలుగు మిషనులు కొనజాలమని తేల్చివేశారు. ఇప్పుడు నాలుగు మిషనులకు విదేశీమారకం సాధించడం కూడాజరిగింది. జాప్యం జరిగిన కారణంగా మార్కెట్టులో ధరలు విపరీతంగా పెరిగిపోయినవి. అయినా గవర్నమెంటు ప్రెస్ లో ఇతర ఇంగ్లీషు లినో టైపు మిషన్లు పాతబడిపోయిన వాటికి బదులు క్రొత్తవి

కోనవలసివున్నది. కనుక ఆ క్రొత్తవి తెలుగు, ఇంగ్లీషు రెండు భాషలకు ఉపయోగపడే విధంగా తయారు చేసుకోవచ్చు. ఆ విధమైన మిషను అమర్చుకొనగలిగేట్లు ప్రభుత్వం వెంటనే ఆర్డర్లు యివ్వవలసివుంది. లినోటైపు లేకుండా తెలుగు ముద్రణలో ప్రగతి సాధించడం తేలిక కాదు. అందుకు అవసరమైన పరిశోధన శాఖను గవర్నమెంటు ప్రెస్‌లో అధికారభాషా కమీషను అజమాయిషి క్రింద 17-3-75 న ఏర్పాటుచేయడమైనది. తెలుగు లినోటైపు రానిదే తెలుగు భాష ముద్రణ సులభసాధ్యం కాజాలదు.

ఇపుడు కేంద్ర ముద్రణాలయం తరపున కొనుటకు వచ్చిన నాలుగు మిషన్లు ఆధారంగా మాట్రిక్సులను తయారు చేయించి పాతబడిపోయిన యింగ్లీషు మిషనులకు బదులు క్రొత్తవి కొని తీరవలసివుంది కావున, ఆ కొనే మిషనులు తెలుగు, ఇంగ్లీషు రెండు భాషలకూ ఉపయోగపడే యేర్పాటు చేసుకొంటూ యింకా నాలుగు మిషన్లకుకూడా ఆర్డరు కంపెనీకి యిచ్చి పనిలో ముందుకు పోవచ్చు.

ఆనందనామ సంవత్సర ఉగాదిపండుగనాడు అఖిలభారత తెలుగు సాంస్కృతిక మహాసభలు జరిపి తాలూకా స్థాయిలలోఅన్ని కార్యాలయాల్లోను అధికార భాషగా తెలుగును అన్వయించుతూ ప్రకటించడం జరిగింది. ఈ రాక్షస నామ సంవత్సర ఉగాదికి జిల్లాస్థాయిలోను, అటుపై ఉగాదికి రాష్ట్ర స్థాయిలోను సంపూర్తిగా అన్వయింపబడుతుందని ప్రకటనలు జరిగినవి. ఈనాడు ఉగాది. ప్రపంచ తెలుగు మహాసభలు జరుపుకుంటున్నాం. అయిదుకోట్ల

ఆంధ్రులు ప్రపంచ తెలుగు మహాసభ జరుపుకుంటున్న ఈ నాడు జిల్లా స్థాయిలో కూడా తెలుగు అధికారభాషగా అమలు జరుప బడునని ముఖ్యమంత్రి ప్రకటించడం ముదావహం. అంతేకాక ఈ సందర్భంలో 13-4-75 తేదీన ఏర్పాటయిన సదస్సులో అంతర్జాతీయ తెలుగు అధ్యయన సంస్థను ప్రారంభించుటకు ఈ క్రింది తీర్మానమును ఏకగ్రీవంగా ఆమోదించుట జరిగినది.

"తీర్మానము :-ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంగా తెలుగుసంస్కృతీ సాహిత్యాల పఠన పాఠనాదులను అభివృద్ధి చేసేఉద్దేశ్యంతో అంతర్జాతీయ తెలుగు అధ్యయన సంస్థను హైదరాబాదులో ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం స్థాపించవలెనని,

ఆ సంస్థను సక్రమంగా సమర్థతతో నిర్వహించుటకు ప్రతియేటా తగినంత రికరింగు గ్రాంటును, భవనాలు మొదలగు వాటిని నిర్మించటానికి చాలినంత కాపిటల్ గ్రాంటును ప్రభుత్వం మంజూరు చేయాలని కోరుటకు,

ఈ తెలుగు అంతర్జాతీయ సంస్థ ప్రచురణలకు, పరిశోధనలకు, శిక్షణకోసం విదేశాలకు పరిశోధకులను పంపించటానికి ఆర్థిక సహాయం చేయవలసినదిగా "యునెస్కో" ను భారత ప్రభుత్వంద్వారా అర్థించుటకు, తీర్మానించడమైనది." జిల్లా స్థాయిమాత్రమేగాక తెలుగు అధికార హోదాలో రాష్ట్రపీఠం అధివశిస్తుందని ఆశిద్దాం. అది జరగడం అవసరం.

అన్ని ఉద్యమాలలో, అన్ని త్యాగాలలో మాతృదేశాభిమానంతో ముందుండి నాయకత్వం వహించినట్లే భాషా ఉద్యమంలో బోధనా భాషగా, పాలనా భాషగాకూడా తెలుగును

అమలు జరుపుటలో ముందుండి ఆంధ్రప్రదేశ్ పేరులోనేగాక, పాలనలో, బోధనలో కూడా తెలుగుభాషను అమలుజరుపుతూ "దేశభాషలందు తెలుగు లెస్స" అని రుజువుచేద్దాం.

"జారిన దేశగౌరవము చక్కనదిద్ది మహాంధ్ర మండలీ
భారము శ్లాఘనీయముగ పాలనచేసి సమాన రాష్ట్రముల్
కూరిమివాసజేయ తెనుగుం బుడమిన్ గయిసేయరయ్య, దీ
టారతినాంధ్రపుత్రులు జగజ్జనధర్మమె దృష్టి నిల్పుచున్"

—o—

